

# వరలక్ష్మీవ్రత పూజా విధానం

హిందూ స్త్రీలు తమ సౌభాగ్యాన్ని కాపాడుకోవడానికి తగిన మార్గాన్ని ఉపదేశించమని పార్వతీదేవి శివుడిని కోరిందట. అప్పుడు పరమశివుడు వరలక్ష్మీ వ్రతాన్ని గురించి తెలిపినట్లు వేదపండితులు తెలుపుతున్నారు. వరలక్ష్మీ వ్రతం శ్రావణమాసంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం రోజున చేస్తారు. ముత్తైదువులు అందరూ ఈ నోమును భక్తిశ్రద్ధలతో నోచుకుంటారు. వరలక్ష్మీవ్రతం రోజున మహిళలు సూర్యోదయానికి పూర్వమే నిద్రలేచి ఇళ్ళు, వాకిళ్ళు శుభ్రపరిచి చిమ్మి ముగ్గులు పెట్టాలి. గుమ్మాలకు మంగళతోరణాలతో అలకరించుకుని, గడపలకు పసుపురాసి కుంకుమబొట్లు పెట్టాలి. తరువాత తలారా స్నానం చేసి ఇంట్లో తూర్పుదిక్కున మండపం ఏర్పరచుకుని, మండపానికి కూడా పసుపు రాసి కుంకుమబొట్లు పెట్టుకోవాలి. ఆ మండపాన్ని అరటిపిలకలు, పువ్వులు, మామిడితోరణాలతో అలంకరించాలి. మండపంలో వెనుకవైపుగా లక్ష్మీదేవి చిత్రపటాన్ని గానీ, విగ్రహాన్ని గానీ ప్రతిష్టించుకోవాలి. (బంగారు, వెండి, రాగి) చెంబును శుభ్రంగా తోమి, పసుపు కుంకుమ బొట్లు పెట్టుకోవాలి. దీనిపై కలశం ఏర్పరచుకొని, కొత్త జాకెట్టు గుడ్డను కలశంలో పరచుకుని, కొబ్బరికాయకు పసుపురాసి కుంకుమబొట్టు పెట్టి కలశంపై పెట్టుకోవాలి. ముందుగా గణపతిని పూజించాలి.

## గణపతి పూజ :

ఓం శ్రీగురుభ్యోన్నమః మహాగణాధిపతయే నమః, మహా సరస్వతాయే నమః, హరిహిఓమ్, దేవాంచ మజనయంత దే వాస్తాం విశ్వరూపా. పశవోవదంతి! సానోమంద్రేష మూర్జం దుహానా దేనుర్వాగస్మా నుపసుష్టుతైతు! అయం ముహూర్త సుముహూర్తోఅస్తూ!! యశ్శివో నామ రూపాభ్యాం యదేవి సర్వమంగళా! తయోసంస్మరణాత్పుమ్సాం సర్వతో జయమంగళం !!

శుక్లాం భరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం!
ప్రసన్న వదనం ద్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే!!
తదేవలగ్నం సుదినంతదేవా తారాబలం చంద్రబాలన్తదేవ!
విద్యాబలం దైవబలన్తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగంస్మరామి!!

యత్రయోగీశావర కృష్ణో యత్రపార్థో ధనుద్ధరః !

తత్ర శ్రీ విజయోర్భూతి ధ్రువానీతిర్మతిర్మమ !!

స్మృతే సకలకల్యాణి భాజనం యత్రజాయతే !

పురుషస్తమజంనిత్యం వ్రాజామిస్వరణం హరిం !!

సర్వదా సర్వ కార్యేషు నాస్తితేశామ మంగళం !

యేషాంప్రుదిస్థో భగవాన్ మంగళాయత్న ం హరిం !

లాభాస్తేశాం జయస్తేషాం కుతత్తేషాం పరాభవః !!

యేశామింది వరష్యామో హృదయస్థో జనార్ధనః !

అపదామప హర్తారం దాతారం సర్వసంపదాం !!

లోకాభిరామం శ్రీరామం భుయోభుయోనమామ్యాహం!!

సర్వమంగళ మాంగల్యే శివేసర్వార్ధసాదికే!

శరణ్యే త్రయంబకే దేవి నారాయణి నమోస్తుతే!!

## ఆచమ్య :

ఓం కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా, గోగిందాయ నమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీ కృష్ణాయ నమః, శ్రీ కృష్ణ పరబ్రాహ్మణే నమః

## ప్రాణాయామం:

ఉత్తిష్టంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః ఏతేషాం అవిరోధేన బ్రహ్మకర్మ సమారభే, ఓం భూః ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం తపః ఓం సత్యం ఓంతత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

ఓం మాపోజ్యో తీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం, మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర పుద్దిస్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే బహ్రా వర్షే భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యవహారిక చాంద్రమానేన సంవత్సరము పేరు ... సంవత్సరే, ... ఆయనే, ... మాసే, ... పక్షే, ... తిథౌ, ... వాసరే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ, విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్ ... గోత్రః ... నామధేయః (ధర్మపత్నీ సమేతః) మమ ధర్మార్థ కామోమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిధ్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం, సర్వాభీష్ట సిద్ద్యర్థం, మహా గణాధిపతి ప్రీత్యర్థం ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే, తదంగ కలశారాధనం కరిష్యే.

## కలశారాధన :

(కలశానికి గంధము, కుంకుమబొట్టు పెట్టి, ఒక పుష్పం, కొద్దిగా అక్షతలువేసి, కుడిచేతితో కలశాన్ని మూసి ఈ మంత్రాన్ని చెప్పాలి)

శ్లో గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధింకురు ఏవం కలశపూజాః

కలశోదకాని పూజాద్రవ్యాణి సంప్రోక్ష, ఆత్మానం, సంప్రోక్ష (అని పఠించి ఆ నీటిని దేవునిపై పూజాద్రవ్యములపై, తమపై అంతటా చల్లవలెను)

మం ఓం అసునీతే
స్థిరోభవ! వరదోభవ! సుముఖోభవ! సుప్రసన్నోభవ! స్థిరాసనంకురు!

మం ఓం గణానాం
శ్రీ మహా గణాధిపతయే నమః! ధ్యానం సమర్పయామి, ఆవాహయామి ఆసనం సమర్పయామి! పాదయో పాద్యం సమర్పయామి! హస్తయో అర్ఘ్యం సమర్పయామి! శుద్ధ ఆచమనీయం సమర్పయామి!

మం    అపోహిస్తామ

శ్రీ మహా గణాధిపతయే నమః! శుద్ధోదక స్నానం సమర్పయామి, స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి!

మం    అభివస్త్రా

శ్రీ మహా గణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి!

మం    యజ్ఞోపవీతం

శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి!

మం    గంధద్వారం

శ్రీ మహా గణాధిపతయే నమః గందాన్థారయామి!

మం    ఆయనేతే

శ్రీ మహా గణాధిపతయే నమః గంధస్యోపరి అలంకారణార్థం అక్షతాం సమర్పయామి!

## అధఃపుష్పై పూజయామి

ఓం సుముఖాయనమః

ఓం ఏకదంతాయనమః

ఓం కపిలాయనమః

ఓం గజకర్ణికాయ నమః

ఓం లంభోదరాయనమః

ఓం వికటాయనమః

ఓం విఘ్నరాజాయనమః

ఓం గణాధిపాయ నమః

ఓం దూమ్రాకేతవే నమః

ఓం గణాధ్యక్షాయ నమః

ఓం ఫాలచంద్రాయా నమః

ఓం గజాననాయ నమః

ఓం వక్రతుండాయ నమః

ఓం శూర్పకర్ణాయ నమః

ఓం హీరంభాయ నమః

ఓం స్కందాగ్రజాయ నమః

ఓం సర్వసిద్ధిప్రదాయకాయ నమః

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః నానావిధ పరిమళపత్ర పూజాం సమర్పయామి

వనస్పతిర్భవైదూపై నానాగంధైసుసంయుతం!

అఘ్రేయస్సర్వ దేవానాం దూపోయం ప్రతిగృహ్యతాం!!

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః దూపమాగ్రాపయామి

సాజ్యంత్రివర్తి సంయుక్తం వహ్నినాంయోజితం ప్రియం గృహాణమంగళం దీపం త్రిలోఖ్యతిమిరాపహం!

భక్త్యాదీపం ప్రయశ్చామి దేవాయ పరమాత్మనే !

త్రాహిమాం నరకాద్ఘోర దివ్యజ్యోతిర్నమోస్తుతే !!

ఓం శ్రీ మహా గణాధిపతయే నమః దీపం దర్శయామి

దూపదీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి

## నైవేద్యం :

శ్లో నైవేద్యం షడ్రసోపేతం ఫలలడ్డుక సయుతం!

భక్ష్య భోజ్య సమాయుక్తం ప్రీతిప్రతి గృహ్యతాం !!

శ్రీ మహాగణాధిపతయే నమః మహా నైవేద్యం సమర్పయామి

ఓం ప్రాణాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, అమృతాపితానమసి, ఉత్తరాపోషణం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి, పూగిఫలై సమాయుక్తం ర్నాగావల్లీదళైర్యుతం, ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం

ప్రతిగృహ్యతాం,

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి

మం హిరణ్యపాత్రం

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః నీరాజనం సమర్పయామి

శ్లో సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణికః !

లంభోదరైశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః !!

దూమ్రకేతుర్గణాధ్యక్షో ఫాలచంద్రోగాజాననః !

వక్రతుండశూర్పకర్ణౌ హేరంభస్కందపూర్వజః !!

షోడశైతాని నామని యఃపఠే చ్ఛ్రునుయాదపి !

విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేతదా!

సంగ్రామే సర్వ కార్యేషు విఘ్నస్థన్యనజాయతే!

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి

శ్లో యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ, తానితాని ప్రనశ్యంతి ప్రదక్షిణం పదేపదే!! పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః ! త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల అన్యదా శరణంనాస్తి త్వమేనా శరణంమమ! తస్మాత్కారుణ్యభావేన రక్షరక్షో గణాధిపః !!

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః ఆత్మప్రదక్షణ నమస్కారం సమర్పయామి

శ్లో యస్యస్మృత్యాచ నామొక్య తవః పూజ క్రియాదిషు!

న్యూనంసంపూర్ణ తామ్యాటి సద్యోవందే గణాధిపం !!

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిపః !

యత్పూజితం మాయాదేవ పరిపూర్ణం తదస్తుతే !!

అన్యాధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజానేనచ భగవాన్ సర్వాత్మకః సర్వం శ్రీ మహా గణాధిపతి దేవతా సుప్రీతా సుప్రసన్న వరదా భవతు! ఉత్తరే శుభకర్మణ్య విఘ్న మస్థితి భావంతో బృవంతు !!



శ్రీ మహా గానాదిపతి ప్రసాదం శిరసా గృహ్యామి !!

మం   యజ్ఞేన

శ్రీ మహాగణాధిపతయే నమః యధాస్థానం ప్రవేశయామి, శోభనార్థే పునరాగమనాయచ

# వరలక్ష్మీ వ్రతం ప్రారంభం

## ప్రాణ ప్రతిష్ఠ:

ఓం అసునీతే హి స్వామినీ, సర్వ జగన్నాయకే యావత్పూజావసానకం ప్రీతిభావేన కలశేస్మిన్ చేత్రేస్మిన్ సంనిన్థిమ్ముకురు, ఆవాహితోభవ, స్థాపితోభవ, సుప్రసన్నో భవ, వరదోభవ స్థిరాసనం కురు (అని పుష్పాక్షితలు కలశముపై, చిత్రపటముపై వేయాలి)

## అధధ్యానం :

శ్లో  పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే!

నారాయణప్రియే దేవి సుప్రీతా భావ సర్వదా!!

క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలాలయే !

సుస్థిరా భావమే గేహే సురాసుర నమస్కృతే !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ధ్యానం సమర్పయామి

శ్లో  సర్వమంగళ మంగళ్యే విష్ణు వక్షస్థలాలయే!

ఆవాహయామి దేవి త్వాం సుప్రీతా భావ సర్వదా!!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః మావాహయామి

శ్లో  సుర్యాయుత విభాస్ఫూర్తే స్ఫురద్రత్న విభూషితే!

సింహాసనమిదం దేవీ గృహ్యతాం సమర్పయామి

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః రత్న సింహాసనం సమర్పయామి

శ్లో  శుద్ధోదకంచ పాత్రస్థం గంధపుష్పాది మిశ్రితం !
అర్ఘ్యం దాస్యామితే దేవి గృహ్యతాం హరివల్లభే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః అర్ఘ్యం సమర్పయామి

శ్లో  సువాసిత జాలం రమ్యం సర్వతీర్థం సముద్భవం !
పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవ నమస్కృతే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః పాద్యం సమర్పయామి

శ్లో  సువర్ణ కలశానీతం చందనాగురు సంయుతం !
గృహాణాచమనం దేవి మయాదత్తం శుభాప్రదే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ఆచమనీయం సమర్పయామి

శ్లో  పయోధది ఘ్రుతోపేతం శర్కరా మధుసంయుతం !
పంచామృత స్నానమిదం గృహాణ కమలాలయే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః శుద్ధోదక స్నానం సమర్పయామి

శ్లో  సురార్చి తాంఘ్రి యుగళే దుకూల వసనప్రియే !
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ సురపూజితే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః వస్త్రయుగ్మం సమర్పయామి

శ్లో  కేయూర కంకణాదేవి హార నూపుర మేఖలా!
విభూషణాన్య మూల్యాని గృహాణ ఋషిపూజితే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ఆభరణాన్ సమర్పయామి

శ్లో  తప్త హేమకృతం దేవి మాంగళ్యం మంగళప్రదం !
మయాసమర్పితం దేవి గృహాణ త్వం శుభప్రదం !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః మాంగళ్యం సమర్పయామి

శ్లో	కర్పూరాగురు కస్తూరిరోచనాది సుసంయుతం !
గంధం దాస్యామి తే దేవి స్వీకురుష్వ శుభప్రదే!!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః గంధం సమర్పయామి

శ్లో	అక్షతాన్ దవళాన్ దివ్యాన్ శాలియాన్ తండులాన్ శుభాన్ !
హరిద్రా కుంకుమోపేతాన్ స్వీకురుష్వాబ్దిపుత్రికే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః అక్షతాన్ సమర్పయామి

శ్లో	మల్లికా జాజి కుసుమై శ్చమ్పక ర్వకులైరపి!
శాతపత్ర్యైశ్చ కల్హారై పూజయామి హరిప్రియే !!
శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః పుష్పాణి సమర్పయామి

## అథాంగ పూజ :

| | | |
|---|---|---|
| చంచలాయై నమః | - | పాదౌ పూజయామి |
| చపలాయై నమః | - | జానునీ పూజయామి |
| పీతంబరాయై నమః | - | ఊరూం పూజయామి |
| కమలవాసిన్యై నమః | - | కటిం పూజయామి |
| పద్మాలయాయై నమః | - | నాభిం పూజయామి |
| మదనమాత్రే నమః | - | స్థనౌ పూజయామి |
| కుంభుకంఠ్యై నమః | - | కంఠం పూజయామి |
| సుముఖాయై నమః | - | ముఖం పూజయామి |
| సునేత్రాయై నమః | - | నేత్రౌ పూజయామి |
| రమాయై నమః | - | కర్ణౌ పూజయామి |
| కమలాయై నమః | - | శిరః పూజయామి |
| శ్రీ వరలక్ష్మై నమః | - | సర్వాణ్యంగాని పూజయామి |

## వరలక్ష్మి అష్టోత్తర శతనామావళి :

ఓం ప్రకృత్యై నమః

ఓం వికృత్యై నమః

ఓం విద్యాయై నమః

ఓం సర్వభూతహితప్రదాయై నమః

ఓం శ్రద్ధాయై నమః

ఓం సురభ్యై నమః

ఓం పరమాత్మికాయై నమః

ఓం వాచ్యై నమః

ఓం పద్మాలయాయై నమః

ఓం పద్మాయై నమః 10

ఓం శుచయే నమః

ఓం స్వాహాయై నమః

ఓం స్వధాయై నమః

ఓం సుధాయై నమః

ఓం ధన్యాయై నమః

ఓం హిరణ్మయై నమః

ఓం లక్ష్మై నమః

ఓం నిత్యపుష్టాయై నమః

ఓం విభావర్యై నమః

ఓం ఆదిత్యై నమః 20

ఓం దిత్యే నమః

ఓం దీప్తాయై నమః

ఓం వసుధాయై నమః

ఓం వాసుదారిన్యై నమః

ఓం కమలాయై నమః

ఓం కాంతాయై నమః

ఓం కామాక్షై నమః

ఓం క్రోధసంభవాయై నమః

ఓం అనుగ్రహప్రదాయై నమః

ఓం బుద్ధయే నమః 30

ఓం అనఘాయై నమః

ఓం హరివల్లభాయై నమః

ఓం అశోకాయై నమః

ఓం అమృతాయై నమః

ఓం దీప్తాయై నమః

ఓం లోకశోకవినాశిన్యై నమః

ఓం ధర్మనిలయాయై నమః

ఓం కరుణాయై నమః

ఓం లోకమాత్రే నమః

ఓం పద్మప్రియాయై నమః 40

ఓం పద్మహస్తాయై నమః

ఓం పద్మాక్షై నమః

ఓం పద్మసుదర్యై నమః

ఓం పద్మోద్భవాయై నమః

ఓం పద్మముఖ్యై నమః

ఓం పద్మనాభప్రియాయై నమః

ఓం రమాయై నమః

ఓం పద్మమాలాధరాయై నమః

ఓం దేవ్యై నమః

ఓం పద్మిన్యై నమః 50

ఓం పద్మగంధిన్యై నమః

ఓం పుణ్యగంధాయై నమః

ఓం సుప్రసన్నాయై నమః

ఓం ప్రసాదాభిముఖ్యై నమః

ఓం ప్రభాయై నమః

ఓం చంద్రవదనాయై నమః

ఓం చంద్రాయై నమః

ఓం చంద్రసహోదర్యై నమః

ఓం చతుర్భుజాయై నమః

ఓం చంద్రరూపాయై నమః 60

ఓం ఇందిరాయై నమః

ఓం ఇందుశీతలాయై నమః

ఓం ఆహ్లోదజనన్యై నమః

ఓం పుష్ట్యై నమః

ఓం శివాయై నమః

ఓం శివకర్యై నమః

ఓం సత్యై నమః

ఓం విమలాయై నమః

ఓం విశ్వజనన్యై నమః

ఓం తుష్టయై నమః 70

ఓం దారిద్ర్యనాశిన్యై నమః

ఓం ప్రీతిపుష్కరిన్యై నమః

ఓం శాంతాయై నమః

ఓం శుక్లామాల్యాంబరాయై నమః

ఓం శ్రియై నమః

ఓం భాస్కర్యై నమః

ఓం బిల్వనిలయాయై నమః

ఓం వరారోహాయై నమః

ఓం యశస్విన్యై నమః

ఓం వసుంధరాయై నమః 80

ఓం ఉదరాంగాయై నమః

ఓం హరిణ్యై నమః

ఓం హేమమాలిన్యై నమః

ఓం ధనదాన్యకర్యే నమః

ఓం సిద్ధయే నమః

ఓం త్రైనసౌమ్యాయై నమః

ఓం శుభప్రదాయే నమః

ఓం నృపవేష్మగతానందాయై నమః

ఓం వరలక్ష్మీ నమః

ఓం వసుప్రదాయై నమః 90

ఓం శుభాయై నమః

ఓం హిరణ్యప్రాకారాయై నమః

ఓం సముద్రతనయాయై నమః

ఓం జయాయై నమః

ఓం మంగళాదేవ్యై నమః

ఓం విష్ణువక్షస్థలాయై నమః

ఓం విష్ణుపత్న్యై నమః

ఓం ప్రసన్నాక్ష్యై నమః

ఓం నారాయణసమాశ్రితాయై నమః

ఓం దారిద్రద్వంసిన్యై నమః 100

ఓం దేవ్యై నమః

ఓం సర్వోపద్రవ నివారిన్యై నమః

ఓం నవదుర్గాయై నమః

ఓం మహాకాళ్యై నమః

ఓం బ్రహ్మవిష్ణుశివాత్మికాయై నమః

ఓం త్రికాలజ్ఞానసంపన్నాయై నమః

ఓం భువనేశ్వర్యై నమః

ఓం వరలక్ష్మ్యై నమః 108

శ్లో	దశాంగం గగ్గులోపేతం సుగంధిం సుమనోహరం !

ధూపం దాస్యామి దేవేశి వరలక్ష్మీ గ్రుహాణతం !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః దూపమాఘ్రపయామి

శ్లో	ఘృతవర్తి సమాయుక్తం అంధకార వినాశకం !

దీపం దాస్యామి తే దేవి గృహాణ ముదితాభవ !!

వరలక్ష్మీ దేవ్యై నమః దీపం దర్శయామి

శ్లో	నైవేద్యం షడ్రశోపేతం దాడిమాద్వాజ్య సంయుతం !

నానాభక్ష్య ఫలోపేతం గృహాణ హరివల్లభే

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః నైవేద్యం సమర్పయామి

శ్లో పూగీఫల సమాయుక్తం నాగవల్లి దళైర్యుతం !

కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః తాంబూలం సమర్పయామి

శ్లో	నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితం !

తుభ్యం దాస్యామహం దేవీ గృహ్యతాం విష్ణువల్లభే !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః నీరాజనం సమర్పయామి

శ్లో	పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే !

నారాయణప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః మంత్రపుష్పం సమర్పయామి

శ్లో	యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ

తాని తాని పుణ్యశంతి ప్రదక్షిణ పదేపదే !!

పాపోహం పాపకర్మాహం పాపాత్మ పాపసంభవ !

త్రాహిమాం కృపయాదేవి శరణాగతవత్సలా !!

అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ !

తస్మాత్కారుణ్య భావేనా రక్ష రక్షజనార్ధన !!

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః నమస్కారాన్ సమర్పయామి

## తోర పూజ :

తోరము అమ్మవారి వద్ద వుంచి అక్షలతో ఈ విధంగా పూజించాలి

| | |
|---|---|
| కమలాయై నమః | ప్రథమగ్రంధిం పూజయామి |
| రమాయై నమః | ద్వితీయగ్రంధిం పూజయామి |
| లోకమాత్రే నమః | తృతీయగ్రంధిం పూజయామి |
| విశ్వజనైన్య నమః | చతుర్ధగ్రంధిం పూజయామి |
| వరలక్ష్మై నమః | పంచమగ్రంధిం పూజయామి |
| క్షీరాబ్దితనయాయ నమః | షష్టమగ్రంధిం పూజయామి |
| విశ్వసాక్షినై నమః | సప్తమగ్రంధిం పూజయామి |
| చంద్రసహోదరై నమః | అష్టమగ్రంధిం పూజయామి |
| వరలక్ష్మై నమః | నవమగ్రంధిం పూజయామి |

**శ్లోకాన్ని చదువుతూ తోరణాన్ని కుడిచేతికి కట్టుకోవాలి**

శ్లో బాధ్నామి దక్షిణే హస్తే నమసూత్రం శుభప్రదం !
పుత్రపౌత్రాభి వృద్ధించ సౌభాగ్యం దేహిమే రమే !!

**వాయన దానం :** వాయనం ఇస్తున్నప్పుడు ఈ శ్లోకాన్ని చదువుతూ వాయనం ఇవ్వాలి

**వాయనం అంటే :** ముత్తైదువులకు పసుపు కుంకుమ, జాకెట్టు గుడ్డ, దక్షిణ, పళ్ళు, పుస్తకం పళ్ళెంలో పెట్టి దానం ఇవ్వాలి

శ్లో ఇందిరా ప్రతిగ్రుహ్ణాతు ఇందిరా వై దదాతి చ !
ఇందిరా తారకోభాభ్యాం ఇందిరాయై నమోనమః !!

ఈ శ్లోకంతో వాయనం ఇచ్చి అక్షతలు తీసుకుని వ్రత కథను చదవాలి

# వరలక్ష్మీదేవి వ్రతకథ :

సూత మహాముని శౌనకుడు మొదలైన మహర్షులను చూసి ఈ విధంగా అన్నాడు. 'ఓ మునీశ్వరులారా! స్త్రీలకు సర్వ సౌభాగ్యాలు కలిగే వరం ఒకటి పూర్వం శివుడు పార్వతీదేవికి చెప్పాడు. దాన్ని మీకు చెపుతాను వినండి.

ఒకరోజు కైలాస పర్వతంపై శివుడు తన సింహాసనం మీద కూర్చుని ఉండగా, పార్వతీద్వి ఆయన దగ్గరకు వచ్చి 'దేవా! లోకంలో స్త్రీలు ఏ వ్రతం చేస్తే సర్వసౌభాగ్యాలను, సంతానప్రాప్తి కలిగి సుఖసంతోషాలతో ఉంటారో అటువంటి వ్రతం ఎదో సెలవీయండి' అని అడిగింది. దానికి పరమేశ్వరుడు చిద్విలాసంగా నవ్వుతూ 'ఓ దేవీ! స్త్రీలకు పుత్రా పౌత్రాది సంపత్తులను ఇచ్చే వ్రతం ఒకటి ఉంది. దాని పేరు వరలక్ష్మీ వ్రతం. ఆ వ్రతం శ్రావణమాసంలో శుక్లపక్ష పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం రోజు చేయాలి.' పార్వతీదేవి ఇలా అడిగింది. 'నాథా! ఆ వరలక్ష్మీ వ్రతం ఎలా చేయాలి? ఏ దేవతను పూజించాలి? ఏ విధంగా పూజించాలి? దీన్ని ఎవరైనా ఇంతకుముందు చేశారా? ఆ వివరాలు అన్నీ చెప్పండి'. పార్వతీదేవి అడిగిన దానికి శివుడు ఈ విధంగా తెలిపాడు 'ఓ కాత్యాయనీ! వరలక్ష్మీ వ్రత విశేషాలు చెపుతాను విను, పూర్వం మగధదేశంలో కుండిన అనే ఒక పట్టణం ఉంది. ఆ పట్టణం నిండా బంగారు ప్రాకారాలు, బంగారు గోడలు గల ఇళ్ళు ఉన్నాయి.

అందులో చారుమతి అనే ఒక బ్రాహ్మణ స్త్రీ ఉంది. ఆమె పతియే ప్రత్యక్ష దైవంగా భావించి, తెల్లవారు ఝామునే నిద్రలేచి, స్నానం చేసి, పతిదేవుడిని పువ్వులతో కొలిచి ఆ తరువాత అత్తమామలకు అవసరమైన అనేక సేవలు చేసి, ఇంటిపనులు అన్నీ ఓర్పుతో, నేర్పుతో చేసుకుంటూ ఉండేది. అందరితో ప్రియంగా, మితంగా మాట్లాడుతూ ఉండేది. ఇంత అణుకువగా ఉన్న ఆ మహా పతివ్రతను చూసి శ్రీమహాలక్ష్మీదేవికి ఆమె మీద అనుగ్రహం కలిగింది. ఒకరోజు ఆ మహా ఇల్లాలికి కలలో ప్రత్యక్షమై మహాలక్ష్మీదేవి ఈ విధంగా చెప్పింది 'ఓ చారుమతీ! నేను వరలక్ష్మీదేవిని, నీ నడవడిక చూసి నాకు నీ మీద అనుగ్రహం కలిగి నీకు ప్రత్యక్షమయ్యాను. శ్రావణమాసంలో శుక్లపక్ష పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం రోజు నువ్వు నన్ను పూజిస్తే నీకు కోరిన వరాలు ఇస్తాను' అని. ప్రత్యక్షమైన అమ్మవారిని చూసి ఎంతో మురిసిపోయిన చారుమతి కలలోనే వరలక్ష్మీ దేవికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి ... 'నమస్తే సర్వలోకానాం జనన్యైపుణ్య మూర్తయే శరణ్యే ద్వంద్యే విష్ణు వక్షస్థలాలయే' అని అనేక విధాలుగా స్తోత్రం చేసింది.

'ఓ జగజ్జననీ! నీ కటాక్షం కలిగిన జనులు ధన్యులు అవుతారు, విద్వాంసులు అవుతారు, సకల సంపన్నులు అవుతారు. నేను పూర్వజన్మలో చేసిన పూజాఫలం వల్ల నీ దర్శనము నాకు కలిగింది' అని నమస్కరించింది. వరలక్ష్మీదేవి సంతోషం చెంది అదృశ్యమయింది. ఆ వెంటనే మెలకువ వచ్చి నాలుగువైపులా చూస్తే చారుమతికి వరలక్ష్మీదేవి కనబడలేదు. అప్పుడు ఆమెకు అర్థమైంది తాను కల కన్నాను అని వెంటనే భర్తనీ, అత్తమామాలని నిద్రలేపి చెప్పగానే వాళ్ళు కూడా చాలా సంతోషించారు. 'ఈ స్వప్నం చాలా ఉత్తమమైనది. దేవి ఆనతి ప్రకారం నువ్వు తప్పకుండ ఆ వ్రతం చెయ్యి' అన్నారు. చారుమతి ఇరుగుపొరుగున ఉన్న స్త్రీలకు కూడా చెప్పింది. వాళ్ళు చారుమతి ఎంతో ఉత్కంఠతో శ్రావణమాసం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూడసాగారు. వారు అలా ఎదురు చూసిన పౌర్ణమి ముందు శుక్రవారం రోజు వచ్చింది. ఆ రోజే కదా వరలక్ష్మీదేవి చెప్పిన రోజుని ఎంతో ఉత్సాహంతో చారుమతి మొదలైన స్త్రీలు అందరూ పూజకు ఉపక్రమించారు. సూర్యోదయానికి పూర్వమే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని తలస్నానం చేసి, పట్టుబట్టలు కట్టుకున్నారు. చారుమతి ఇంట్లో అందరూ చేరి అక్కడ ఒక ప్రదేశంలో గోమయంతో అలికి ముగ్గులు వేసి మంటపం ఏర్పాటు చేశారు. దానిమీద ఒక ఆసనం వేసి దానిపై కొత్తబియ్యం పోసి, మర్రిచిగుళ్ళు మామిడాకులతో కలశాన్ని అలకరించారు. అందులో వరలక్ష్మీదేవిని ఆవాహన చేశారు. స్త్రీలతో బాటు చారుమతి కూడా భక్తిశ్రద్ధలతో వరలక్ష్మీదేవిని పూజించారు.

'పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే నారాయణ ప్రియే దేవీ సుప్రీతా భవసర్వదా' అనే శ్లోకంతో ధ్యాన వాహనాది షోడశోపచార పూజ చేశారు. తొమ్మిది సూత్రాలు ఉన్న తోరణాన్ని కుడిచేతికి కట్టుకున్నారు. వరలక్ష్మీదేవికి అనేక రకాలైన పిండివంటలు చేసి నైవేద్యం సమర్పించారు. తరువాత ప్రదక్షిణం చేస్తుండగా ఆ స్త్రీలందరికీ ఘల్లు ఘల్లు మంటూ శబ్దం వినిపించింది. వెంటనే తమ కాళ్ళను చూసుకుంటే గజ్జెలు మొదలైన ఆభరణాలు కనిపించాయి. చారుమతి మొదలైన స్త్రీలు అంతా వరలక్ష్మీదేవి కృపాకటాక్షాలు కలిగాయి అని ఎంతో సంతోషించారు. రెండవ ప్రదక్షిణం చేయగానే చేతులకు ధగధగలాడే నవరత్నాలతో కూడిన కంకణాలు మొదలైన ఆభరణాలు కనిపించాయి. ఇక మూడవ ప్రదక్షిణం పూర్తవగానే ఆ స్త్రీలంతా సర్వభూషణాలంకృతులు అయ్యారు. చారుమతి మొదలైన స్త్రీలు నివశించే ఇళ్ళు అన్నీ స్వర్ణమయం అయ్యాయి. వాళ్ళకి రథగజ తురగ వాహనాలు ప్రసాదించబడ్డాయి. చారుమతి ఇంటినుండి ఆ స్త్రీలను తీసుకుని వెళ్ళడానికి వారి వారి ఇళ్ళనుండి గుర్రాలు, ఏనుగులు, రథాలు, బళ్ళు వచ్చాయి. ఆ స్త్రీలు చారుమతి కలిసి వారి చేత శాస్త్రప్రకారం పూజ చేయించి బ్రాహ్మణోత్తమునికి గంధం, పుష్పం, అక్షతలతో పూజించి 12 కుడుములు వాయనం ఇచ్చి, దక్షిణ తాంబూలాలు ఇచ్చి నమస్కరించారు. బ్రాహ్మణుడు వారిని ఆశీర్వదించాడు. వరలక్ష్మీదేవికి నైవేద్యంగా పెట్టిన పిండివంటలు బంధుమిత్రులతో తమ తమ కోసం వచ్చిన గుర్రాలు, ఏనుగులు మొదలైన వాహనాలలో వారివారి ఇళ్ళకు బయలుదేరారు. మార్గమధ్యలో స్త్రీలు చారుమతి భాగ్యాన్ని, తమ భాగ్యాన్ని ముచ్చటించుకుంటూ వెళ్ళారు. లక్ష్మీదేవి తనంతట తాను స్వప్నంలో వచ్చి ప్రత్యక్షమవడం చారుమతి చేసుకున్న అదృష్టం అని అనుకున్నారు. చారుమతికి ప్రత్యక్షమైన విధానం తన దగ్గరే దాచుకుని తను ఒక్కతే పూజించకుండా తామందరికీ చెప్పి, తమకి కూడా ఇంతటి సౌభాగ్యం కలగజేసిన చారుమతి ఎంతటి పుణ్యురాలు, అలాంటి ఆమె పరిచయం కలగడం తమ అదృష్టంగానూ తమను భాగ్యవంతులను చేసినందుకు సంతోషించారు. ఆనాటి నుంచీ చారుమతితో సహా మిగిలినవారందరూ క్రమం తప్పకుండ ప్రతీ సంవత్సరం వరలక్ష్మీ పూజ చేస్తూ పుత్రపౌత్రాభి వృద్ధి కలిగి, ధన కనక వస్తువహనాలు కలిగి సుఖసంతోషాలతో ఉన్నారు. కాబట్టి 'ఓ పార్వతీ! ఈ ఉత్తమమైన వ్రతాన్ని చేస్తే అలా ఎదుటి వారికి చెప్పి చేయిస్తే సర్వసౌభాగ్యాలు కలిగి సుఖంగా ఉంటారు. ఈ కథను విన్నవారికి, చదివిన వారికి కూడా వరలక్ష్మీదేవి ప్రసాదం వలన సకల కార్యాలూ సిద్ధిస్తాయి' అని తెలిపాడు పరమశివుడు.

సూతమహాముని శౌనకుడు మొదలైన వారితో 'మునులారా! విన్నారుగా చారుమతి ఎదుటివారి మంచి కూడా ఎలా కోరుకుందో? ఎదుటి మనిషికి మంచి కలగాలని కోరుకుంటే అమ్మవారు ఇంకా ప్రసన్నురాలు అయి మీరు కోరకుండానే మీకు మంచి చేస్తుంది' అని అన్నాడు.

**కథాక్షతలు అమ్మవారి మీదవేసి, మీ మీద వేసుకొని, మిగతావారి మీద వేయండి.**

## వరలక్ష్మీదేవి వ్రతం సమాప్తం